# కృత్తికసూత్రము.

శతావధాని శివరామకవి.

# కృతకసూత్రము.

౧. తనవచ్చిరానిమాటల
కు నుపాధ్యాయుండు మెచ్చికొనఁజూచెడివా
రును వ్రేలఁజూపి ముదముం
బనుపడఁగఁ గురంగియనెడు బాలికయలరున్.

౨. తనతో పాటుగ 'నోనమాలు' తెలివొందంజాలి, 'అఆల' ది
ద్దను, 'కాఖాల' గడింపఁగా మఱియు, 'తాథాల్ యూరవాలన్న పా
ల'ను నేర్వన్ జెలికారముం బెనుపఁజాలంజాలు నీపిల్లవాఁ
డనఁగాఁ బొల్చుశరత్కుమారుఁడనువాఁడా బాలతో నాడుచున్

౩. ఈ నెఱుంగదు దుఃఖమ్ము నెఱుఁగఁబోదు
పాపమెఱుఁగదు తెలియదు ప్రాకృతంబు
పెరిమె చెలికారములమాత్రఁ బెనిచికొనును
ఎంచఁగా బాల్యమదియెంత మంచిదో కో

౪. వాలుకాపులినమ్ముల వాగులందు
పొన్నమ్రాకుల నునుపారు తిన్నెలందు
బండిగురివెందతీవెల పాదులందు
ఆడుకొందురు మలుసంజలందువారు.

౫. ఎడఁబాయని ప్రేముడిచే
నడుగడుగున కుబుసుపోక, అట్టే చెవిలో
గుడుగుడులాడుదురు ముదం
పడుదురువారిద్దఱార బాల్యంబందున్.

క. బడియాట సడలిపోయెన్
బుడిబుడి చెలికాండ్రతోడి బుజ్జగముడిగెన్
వడిఁ బెండ్లివయసు వచ్చెన్
నడయాడందొడఁగె జవ్వనము చెలిమేనన్.

మ. ఒకనాఁ డించుకభూషితాంగియయి సూర్యుం డస్తముం బొంద
న్వికచాంభోరుహనేత్ర యందెలగొడల్ విశ్రాంతిఁ జెందంగ
లికగాఁ బాదములుంచుచున్ జనియెఁ బాలీలానికుంజంబు చే
తకమందానిలమూచిపుల్చినపుష్పల్ తావుల్ దెసల్ గ్రమ్మఁగన్.

సీ. పోయికూర్చుండునంతటఁ బోరు వెట్టి
కూయఁదొడఁగెడు వెనుగండఁ గోయిలలకు
రోసవిూసును గెడఁగొని మోసులెత్త
నుసఁగలేదు కురంగి ప్రత్యుత్తరంబు.

ఉ. నించినపూలయంపు శయనించిక పోలతలంబు నంటఁగా
వంచి కరాంబుజం బెడమువైపుగ నొత్తిలి కాలిఁ ద్రేలి నా
డించుచు నూర్పుగాలి బుసడింపఁగ మోవియు వాడిపోవఁ జ
తాంచితమూర్తియై చుజవరాలసియిం దెనుశూన్యభావనై

చ. తలఁపునఁబట్టనంత పరితాపము, కన్నులుచాలనంత పె
ద్దలు కనునీటిబొట్లు మదిఁ దాపఁగఁజాలనియంతయూసు కో
దలమును నాపెమోము నెమదర్పణమందుఁ బృథక్ పృథక్ స్థితి
గళలధరించి రూపములుగాఁ గనఁబట్టెఁదొడంగె వింతగన్.

సీ. ప్రక్కగాఁబోవుచుండె శరత్కుమారు
డప్పు డత్యరుణాంబుజాతాయతాక్షి
సుప్తకుత్తుకతో డప గొణుగుకొనుచు
వడిగ లేచెను పాదముల్ వడఁకుచుండ.

ఉ. చూచుశరత్కుమారునకుఁ జోద్యముగాఁ గనఁబట్టె నాకురం
గీచకితైణలోచన వికీర్ణమునౌకబరీభరంబుతో
సూచితకోపరోష పరిశోషకషాయితమైన మోముతో
నాచిత బాష్పబిందువుల నంతట నానినకన్నుదోయితో.

క. ఒకపాదునందుఁ బెరిఁగిన
యకళంకపుఁదీఁగె మొగ్గ లగుటనతం డా
సకియఁ గనుంగొనినంతట
వికలుండై మొగమొకింత వెనుకకుఁ ద్రిప్పెన్.

ఉ. అంగుచునాతఁ డాపె హృదయంబున నేమికళంకమున్నదో
నేఁ గనుఁగొందునంచుఁ దరుణీమణి డగ్గఱి పల్కరింపఁగా
మూఁగడివోలె నప్పుడొకముచ్చటయాడదు తేరిమోమునన్
దీఁగన లెంజలించుఁ బడిదేవనముం బొనరించు నింపుగన్.

తే. ఆమెకంటను మిగుల నత్యార్ద్రచిత్తుఁ
డగుటఁ జూడంగ లేక మార్గము వెట్టి
యొఱఁగమిన్ వెక్కివెక్కి తానేడ్చునపుడు
ప్రకృతికింగూడ గుండెలు పగులువారె.



తే. తుదకునామెయె మనమును గుదుటఁబఱిచి
కొలుకన్నీరు కొనగోటఁ గడకుఁజిమ్మి
యొప్పు నిట్టూర్పులను సరి నొందఁజేసి
అల్లనల్లన 'నేమోయి' యంచుఁబలికె.

తే. అటులు పలికెడు చెలి కార మాత్మఁదలఁచి
అంతు 'నేమోయి' యనియెడు నందమెంచి
గంటువిడి శరత్కుమారుఁ డుండుచూచె
సార శారదచంద్రికా సారదృష్టి.

గీ. "వెన్నెలబయళ్ళ కొంటిగా వెడలనగునె?
బొంగుపొదరిండ్లయందు నుండంగఁదగునె?
మహిళకలటంచును శరత్కుమారుఁడసినఁ
దలనువంచికురంగి శాంతంబుపొందె.

సీ. వచ్చిరానట్టిమాటల వరుసతోడ
దెలిసి తెలియని ప్రేమ శృంఖలలతోడ
మఱచిమఱువనియనుభావ మహిమతోడ
మరగు శైశవమది యెంత మంచిదోయి!

క. నావుడు నెమ్మనమునఁ ద
ద్భావము ప్రేమానుబంధ పరమా యెనటం
చావిజ్ఞుఁడు తెలిసికొనెన్
బోవంగాఁ దలఁచెఁ బీఁడి పోలతుకనంతన్.

ఉ. కాని స్వకీయమైన చెలికారము చిన్నతనంబునుండి, యా
మానిని చేసియుంట నొకమాదిరిగాఁ గను జిన్నఁబుచ్చి యో
ర్లేనిఁ జనంగలేక యతఁడించుకమాఱుమొగంబు వెట్టి వే
ఱైన ప్రసంగమాయెహృదయంబునఁ జొన్పఁగనెంచి యిట్లనెన్.

సీ. ధరణికోటపురీవరాంతరమునందు
స్థాపితంబగుపెను పరిషత్తునందు
విద్య నభ్యసనమొనర్ప వెడలువాఁడ
నీదుతండ్రియె ప్రేరేచె నిన్ననన్ను.

గీ. అనుచుఁబల్కిన నిస్పృహ యగుచునంత
బిక్కమొగమును వైచి విభీతనయన
తలనుబంకించి నిట్టూర్చి దళితహృదయ
యూనుచుఁబోడకట్ట నతని కయ్యవసరమున.

మ. నెలఁతా! యీడునఁ జోడువారమయినన్ నీకంటెఁ బుంధర్మతా
కలనన్ గొంచెము పెచ్చు నాకనుభవగ్రంథంబు, మీయింటిపె
ద్దలు చూపించిన త్రోవ నెక్కరు నవిద్యావాసనావాసితున్
బాలుం బారక వరియింపు మంచు నతఁ డప్పూబోఁడితోఁ బల్కినన్

సీ. పులుకుపులుకునఁ జూచు చూపుంగములను
బోఁడితనమును వైరాగ్య మును విశేష
నిస్పృహాత్వంబుతోఁ బ నా నీరజాక్షి
మొగముఁదన రెండుచేతుల మూసికొనియె.

సీ. తఱుఁగుకొనిపోయె హృదయ మాతనికి మిగుల
నప్పుడాజాణ నిముసమే నాఁగలేక
చిన్నతనమునుండియుఁ జేసినట్టి
కడిఁది చెలిమికిఁ దగినట్లు కౌఁగిలించె.

ఉ. చేరల కెక్కుడౌ కనులఁ జేరిన వెచ్చని నీరెడల్చి చె
న్నారెడు కేశపాశమున యందుఁ దగుల్కొని చిక్కువడ్డ మం
దారపు లేఁతపూఁతను నిదానముగాఁ దెమలించి పొన్నపూఁ
గోరల నోసరించి సుమకోమలికిన్ ముదమారఁ గూర్చుచున్.

ఉ. పూలను గొన్ని త్రుంచి తృణముల్ మఱికొన్నిటిగోసి వానినిన్
మాలికగా నమర్చుకొని మంగళసూత్రముఁ బోలినట్టి పూ
మాల కురంగి నెమ్మెడను మల్చి తగిల్చెఁ జెలంగ సౌఖ్యలో
ద్వేలసమాగతాళిరుతి దీపితమంగళవాద్య ఘోషముల్.

క. సంతోషభరస్వాంతులు
నంతేవాసులు నటక్క యాచార్యునకున్
గాంతస్వరూపులగువా
రంతట వేద్వేలు బాట నరిగిరి పెలుచన్.



ఉ. ఆమఱునాఁటిపొద్దున రయంబున వెల్వడి బ్రహ్మచర్యదీ
క్షామహితంపువేసమునఁ గానఁగఁబట్టెను భాగవిత్రి, వి
ద్యామహిళాధినాథునకు నచ్చెరువాటుఘటించి తన్నునున్
బేర్మిముడిశిష్యమండలిఁ బరిగ్రహణంబొనరింపనింపుగన్.

క. గురుపాదసేవకఁబట్టుచు
నురుతరవిద్యా మహామహోదధినీఁదన్
బురికొని నెరతుర్కమాయఁ జా
పరులకుఁజొప్పడనిభయమును భక్తియునింపన్.

ఉ. దోసములేనివేసము శ్రుతులఁ బచరించె సుకీలిసీతి ద
ర్భాసనమే యలంకృతిగ సల్పిన నొజ్జ యుపన్యసింప వి
శ్వాసముగల్గి పచ్చికలపట్టున నిక్కమొనర్చిబూఁదె నై
సేసి పఠించునెల్లప్పుడు శిష్యులలోపల శీఘ్రబుద్ధియై.

ఉ. సారముచాలఁ దేర్చి జగజంపనుమాటయెఱుఁగఁ బోక వి
ద్యారసపారవశ్యమునఁ దాల్మివహించుచు శిష్యకోటిపై
గారముకల్గు కూర్మిసుతకున్ననుగ్రహమూని దుష్టకృ
త్యారభటింగలంచినయమూరఁగఁ జెప్పెను, భాగవిత్రియున్

ఉ. జీతముబత్తెమాటలకుఁ జేష్టలకున్ దుసు మొట్టుమస్తులున్
గైతవమైనడంబముల కల్పన గూఁకగురు ప్రసక్తిపై
పూఁతలు మేఁతలున్ వాసనగుబోడిమినూడనికృత్యముల్ సహా
సీతముకావకొక్కపుడును నిర్మలమైన తదాశ్రమస్థలిన్.

చ. ఎనయుగుబల్లలేదు, కొఱఁతేమియది ? పచ్చికపట్టులుండఁగా; సం
పెనసెజముస్తులేదు, కొఱఁతేమియది? నారలచీరలుండఁగా; బొం
తనమగుకుర్చిలేదు, కొఱఁతేయది? దర్భకటంబులుండఁగా; ఘం
ధనములుకైతవంబులివి తగ్గునకాదె నిసర్గసృష్టికిన్

ఉ. ప్రాణముపోయినన్ గురుని పల్కినకున్ జవదాటరాద తా
మానముపోయినన్ మృషను మందునకైనను బల్కరాద వి
జ్ఞానముమాసిపోయినను గట్టడికింపలెఁగంగరాద ప్రా
మాణిక మేమపల్కరుదుమమ్మరె! యాంతనియాశ్రమంబునన్.

సీ. సాహిత్యసాహిత్య సందర్భముగ్రహించె
న్యాయవేదాంతంబు లభ్యసించె
వైయాకరణ సమన్వయ సంప్రదాయంబు
లెఱిఁగె సాంఖ్యంబున నెఱుకఁజెందె
యోగశాస్త్రమునందు యోగ్యతనుగమించె
గానాదమం దధికారమొనసెఁ
గవితావిలాసిని కాముకుండయిమించె
ధర్మశాస్త్రముల సందర్భమెఱిఁగెఁ

గీ. బెండిలింజేసికొన భాగవిత్తికడను
దానునుజ్ఞాతుఁడై సముదారగతిఁ గు
రంగిఁజూడంగఁ గుతుకతరంగితుఁడయి
వెసలెనుశరత్కుమారుండు విన్నువుగ.

ఉ. తల్లినిగాంచుటొండెఁ దనతండ్రినిఁజూచుటయొండెఁ దమ్ములన్
బిల్లలఁజూచుటొండె మఱివృద్ధులఁజూచుటయొండె లేకయా
హల్లకపాళిపై నయిదుప్రాణములుంచి తదేకదృష్టిచే
నల్లయతండుమార్గమున నాతుఁడై చనుఁబేర్మిబర్వగన్.

శా. మధ్యేమార్గమువచ్చె నెత్తిపయికిన్ మార్తాండబింబంబటా
మధ్యాహ్నంబునసగ్గఱంగొలుచుగ్రామంబుదానాగియా
రాధ్యంబైతనదేవతాసమితినారాధించి డెందంబునన్
సిద్ధ్యానంబుననుండి కొంతవడికిన్ జేరెన్ గృహంబొక్కడున

గీ. అందునివసించువారల కతిథియగుచు
నారగించెను శుభ్రింపు టన్నరసము
ప్రకృతిగాఁబండు పండులు పాలులోను
నైనయాహారములను మధ్యాహ్నవేళ.

క. అలుపముగఁ బండుకొనియతఁ
డలవారలకడను సెలవు నందిజగమిషా
కలితుఁడయి బయలుదేరెన్
లలనాసందర్శనాభి లషితుండగుచున్.

గీ. తానుబట్టినమార్గమా ధరణిదేవు
దీసికొనిపోయె నొక్క కృత్రిమవనంపుఁ
బజ్జకెఱుఁగక యెక్కిన పడవ సాగి
పాలమున్నీటినడుమకుఁ బట్టినటులు.

గీ. జీడిమామిడిచెట్లుకం చెలనుదాఁటి
లోనికింబోవదారిఁ దెల్పు చునుండెఁ
గొన్నిచోటులనట్టికో ర్కులకుఁదావు
కొలుపకెంతయుగొడ్డంటఁ గొట్టఁబడియె.

క. చనియెను శరత్కుమారుఁడు
తనముందటఁగాంచె నొక్కతరుణీమణిఁ జ
క్కనిపండు తఱపివెన్నెల
యనసౌందర్యంబు వెల్లియై పాఱగన్.

సీ. చెమరుఁజిత్తడిచేతఁ జెలువారుమోముపై
ముంగురులొకవింత మురుపుసూపఁ
గొనవ్రేళ్లపైలేచి చనుటచేఁ బొడవగు
పొడవుఁదనంబున బెడఁగెలర్పఁ

# కృతకసూత్రము.

గదలుబింకంపు టంగకములు చూచువా
రలకెల్ల నేత్రపారణమొనర్పఁ
గాటుకదీర్చిన క్రాల్గన్నుదోయి వి
చ్చిన నల్లఁదమ్మిపూ తీరుతోఁప
గీ. నొడసిపట్టిన కుచ్చెల లుజ్వలింప
మృదులకురువిందమాలికల్ కదలియాడ
నెత్తి యరకాలుసూచుచుఁ దత్తరిలుచుఁ
గంచెనుందాఁటి వచ్చుట కానవాయె.
క. ఇదినలఁకెపుడో చూచిన
యదియనుభావంబు తలఁపునందుఁ దలిర్పన్
మృదితమృణాళీశోభా
స్పదయగు నలదానిఁగాంచె సందేహముతోన్.
గీ. పొంచిపరికింప దానిచూపుననుబడక
యుండఁ దనసందియంబును నోసరిల్ల
ద్రాక్షపందిలిక్రిందికిఁ దారె నతఁడు;
అతఁడుకనకుండదాఁగె నయ్యతివమిన్న.
గీ. కానలేకుంటనతఁడు తత్కాంచనాంగి
తొల్లివ్రాసినలేఖను నల్లనల్లఁ
దాళపత్రాలఁబొల్చు గ్రంథంబునుండి
తెఱచెఁ గొంచెమువ్రాసి పెంపఱీనదాని.
క. ఎవరును లేకుండఁగఁ దా
నవలోకించుచు దిశాంతరాంతరముల ని
క్కువపుంబ్రేముడిఁ జదువఁగ
నపునని యిటుసదివె నేలనాసీనుండై.

‘ గురుజనానురోధమా? నాబుద్ధినిఁ బరీక్షించుటయా? గృహనివాసమునవలదను ఎత్తిపొడుపా? ప్రేమవిచ్ఛేదాభిలాషమా భక్తజనపరిత్యాగోపాయమా? ప్రకోపమా? లేకయివన్నియు నా? సఖుఁడా నీపయనమునకు అర్థము నెఱుంగనయ్యెద.

అతిప్రియుఁడనందునా! పౌనరుక్త్యము; నీకునేను ప్రియునన్నచో జడప్రశ్నము; నీయెడ నాకు వలపుచాలఁగలదనిన వేశ్యాలాపము; నీవులేనిది బ్రతుకఁజాలననిన, అనుభవవిరోధము; నన్నుఁ బూవిలుకాఁడు పరిభవించుచున్నాఁడనినచో, ఆత్మదోషోపాలంభము; మన్మథుడు నన్ను నీకిచ్చెనన్న ఉపసర్పణోపాయము; నాచేఁదప్పక వరింపఁబడితివనిన బంధకీధార్ష్ట్యము; తప్పకరమ్మనిన సౌభాగ్యగర్వము; నేనేవచ్చెదననిన స్త్రీచాపలము; ఇదియనన్యయనినఁ గొదవ; నీవు కైకొనవేమోయనిన లేవనివానిని లేపుట; చావుచే నావలపు నెఱుంగుదువనిన నముంగళంబు: కావున నీకేమివ్రాయుదు?

* * * * * * కురంగి.

గీ. అనుచునోపిక మిక్కిలి యనుగమించి
పర్ణపనమయవములను బ్రభ్రష్టపత్రి
భాగములఁగూడఁ బూరించి భావభరిత
మైన యీలేఖసడివెఁ బేశాసతోడ.

క. చదువున్ మఱలంజదువున్
జదివి తదీయాంతరార్థ సందర్భము నె
మ్మదివిస్తరించికొను మో
హదశా దందహ్యమానుఁడయి కడుఁబొగులున్.

సీ. సర్వవర్ణస్ఖలిత సముచ్చారణంబు
గాఢగాద్గద్య సంరుద్ధ కంఠనాద
మూర్ఛితాశావశానుకంపోదయంబు
తత్స్వనంబు వినంబడెఁ దగులఁదరుల.
సీ. అవురవుర! కాలపు న్విపర్యాసమహిమ
బాల్యకౌమారములకు యౌవనమునకును
భావభేదపరికార సంభరితలీల
వాస్తవంబుగ నెవనికవాచ్యమకట!
సీ. తలఁపునకువచ్చు సంకల్పితంబులైన
చేష్టలెల్లప్డు వానిలోఁ జిక్కికొసిన
మనము బాహ్యేంద్రియ నిరుద్ధము నపార
మైనయానందమందు లయంబుఁజెందు.
సీ. బాఁగుగాఁ బఠియించిన పాఠములను
నేని నీ కవికాకున్న నేనుగూడ
రానివానివిధాన కురంగనేత్రి!
చెలఁగితిని, బజ్జ శిక్షచేసిననుగాని.
సీ. సహజసర్వావయవ సువిస్తారలక్ష్మి
కనులఁగట్టినయట్టులఁ గానఁబడుట
నెత్తికట్టిన జెప్పుల నెల్లరేలఁ
గాచుకొనియుంటిఁ జదువున కన్నశ్రద్ధ.
సీ. కలలనైననునీరూపుఁ గాంచవచ్చు
నంచు నిదిరింపఁబో, సహాధ్యాయులెల్ల
జేయుచింతనయలికిడి చేతలేచి
తెప్పిఱిలి నన్ను నేనె నిందించుకొందు.

చ. కనులకు నిద్రరాక సరిగా నొకహస్తము వట్టి దేన్నినై
నను జదువంగఁ బోవఁగ మనంబున నీదగు రూప మేర్పడన్
మననము చేయుచుంట నొకమాదిరిగాఁ బుటలన్ని విప్పి కో
లునుగడు నేర్చెహస్తములులోలనఖారుణిత్రోజ్వలాంగుళుల్

గీ. శేల మిగిలిన నాలవ జాలులందు
మూసి తెఱిచిన కన్నుదమ్ములు చలింపఁ
జాన! యేఁగెదెచటి'కంచ సత్యకంఠ
నాళ విన్యస్త బాహు బంధనుఁడనగుదు.

ఆ. "తెల్లవాఱె మోము నుల్లంబు కృశియించె
నందమైన దేహ యష్టిడస్సె
నెట్లు చనువుచుంటి వేమోయి" యనినన్ను
సరసమాడుచుండ్రు సంగడీండ్రు.

గీ. నయముగా వచ్చు నా యనధ్యయనదినము
లందుఁగనరాక యొంసహాధ్యాయులకును
గొండ వాగుల కడ కేఁగి కూర్తు నీదు
చేష్టలను గూర్చి కవితా విశేషములను.

గీ. చేసిన సమస్తచేష్టలఁ జెప్పుచుండు
నాడు నాటలనుం దెలియంగఁ జేయు
నాడు పలుకుల నెల్లరాపాడుచుండు
శైశవ గ్రంథి కఠిన పాషాణసంధి.

మ. చెలియా! శైశవ బాల్యభావములు చేసెన్నికునుక్ నాకు స
చ్చలమా స్నేహదశానుబంధమును సాక్షాద్యావనంబిప్పుని
ర్మలమా ప్రేమనుదానఁ గూర్చిస్థిర సంబంధంబుఁ గల్పించునో
బలవద్దైవ నియోగదార్ఢ్యమున వేర్పాటుంబడం జేయునో!

క. కుపితా! వియోగ దుఃఖ
గ్లపితుఁడనై జీవ మూడ్వఁగా నెంచను నా
స పడుచు 'జీవన్ భద్రా
ణి పశ్యతి' యనంగ నొప్పు నీతి యెఱుక చేన్.

ఆ. ఆకురాలు కాలమందున పడెదు కా
రాకులనఁగ నాసయట్టెపడును!
తఱినిగట్టిపడెదు తరువులచేవనాఁ
బెఱఁగి పెఱఁగి చాల బెనిచికొనును!

గీ. మొదలనద్దాననాకుఁ బ్రేముడియె లేద
యొండమూవిని నాపె యొక్కింతనాఁటె
నాట ననలెత్తె; ఔను. కొ్రిందఋకు పేర్మి
తమ్ములనెడారినైన స్ఫుటమ్మొనర్చు

ఉ. వీనులవిందుగాఁగను సవిస్తరమాత్మ దశానుభావ సం
ధానముగాఁగఁ జెల్మికి నిదానముగాఁగ లతాకుటీర సం
తానన దత్ప్రితిధ్వని విధానముగాఁగ శరత్కుమార దీ
నానన సీమ నిర్గళితమైన వియోగపు సూక్తులాఁగినన్.

మ. అవలగ్నంబసియాడ మోము దరహాసాంకూరమై పొల్వఁ గ
న్నవ లజ్జాపిహితాతిసాధ్వసమునై కాన్పింప ధమ్మిల్ల మా
యవటూదేశమునందుఁ జొ్రివ్వపడ దివ్యంబైన రూపంబుతో
నవలా మానిక మేగుదెంచెను కవోష్ణంబైన నిట్టూర్పుతోన్.

గీ. వచ్చియును రాకముందె యావనరుహాక్షి
మఱచినాఁడవె? నన్నునో మానధనుఁడ!
యంచుఁ జిత్రిముగాఁ బ్రశంసించెనపుడు
నగవుమోమున మేలిరత్నాలు రాల.

శా. ఆనారీమణిపల్కుపల్కులు శ్రవోవ్యాసక్తి నాఁబొందిబ్ర
హ్మానందంబుసుఖంబుకంటె నితమామానందసాంద్రోదయ
శ్రీనిర్వాణవిధాచమత్కలితుఁడై శీర్యజ్జగజ్జ్ఞాన సం
ఖ్యానుండా యెశరత్కుమారుఁడదివో! గాఢానురాగంబనన్

మ. పయిపైఁబర్వెడు సిబ్బితిన్ విడిచి యాప్రాజ్ఞుండిటుల్ వల్కెనీ
పయిఁ బ్రేమంబుననిన్ని నాళ్ళమగువా! ప్రాణంబులన్ జిక్కఁబ
ట్టియెటో కాయముమోవఁగాఁగలిగియుంటిన్ నేఁటికిందావకా
భయహస్తంబునుబొందఁగల్గుటకు నాభాగ్యంబుసాయంపడెన్

క. అనఘుఁడు గురంగి తన పెద
విని గఱచికొనెన్ విరుద్ధవిస్మితచేష్టన్
కనఁబడియెమోమునందున
ననుమానము తేరికొనియె నంతస్సుననున్.

క. తదనంతరమున నాతఁడు
పదిలమె నాకట్టినట్టిబల్బజపుష్పా
స్పదమగు మంగళసూత్రం ?
బదిమఱచితె? యనియెప్రేమ మన్నినమదిఁజోక్.

మ. అనినన్ సంకుప్రోసిక్రొమ్మెడయెడన్ హస్తాంగుళుల్ సేర్చియా
వనజాతాయతనేత్ర సాధ్వసభరభ్రాంతాత్మయై పైట చెం
గునొకింతన్ దెమలించితీసెమిగులన్ గ్రొవ్వాఁడుపూమాలయుం
దనుసంధించినతాళిబొట్టునుమహీయఃకాన్తి కాన్పింపఁగాన్.

క. అప్పుడు శరత్కుమారుని
ముప్పిరిగాఁబెణఁగినట్టి మోహపుఁ బాశం
బొప్పరికించుచ్చుఁ బ్రిదిలెన్
దప్పుకదా! తనదటంచుఁ దత్క్షణమాత్రన్.

ఉ. మంగళసూత్రదర్శనమిమంక్షిత మృత్యుసముద్రుఁడైయతం
డంగనమీఁదఁ బ్రేమవిడనాఁడఁగలేక తదీయసుందరా
పాంగవినర్దళద్హృదయపంకజుఁడై ధృతిదూలియునివితా
కుంగడుబాఁ దెఁదా మొదలుగోట్టిన చెట్టునుబోలెఁ వ్రేల్మిడిన్.

క. ఎక్కడనుంటి? కురంగీ!
యెక్కడనెక్కడ? నటంచు నింపొలసెడు మేల్
వాక్కులతోఁ గొందఱు చెలు
లక్కడకేతెంచి రొయ్యనా సమయమునన్.

గీ. ఆస్వరంబది వినఁ బడునంతమాత్ర
వెడలిపోయెఁగురంగి సోద్వేగయగుచుఁ
గడఁగి వీతెంచుచున్న పెన్గాలిదెబ్బ
కోసరిలి పాఱునొకచిన్నయోడ వోలె.

గీ. పోవువెంటనె యాతఁడా పుష్పుఁబోఁడి
సంకుపుంబోని మెడయందెసంగుచున్న
తానుగట్టిన కృతకసూత్రంబు తోడ
వఱలు నాతాళిబొట్టుఁ పైఁ బఱపిమనసు.

ఉ. ‚‚వంచన చేసె నన్నతివ వాంఛను దెల్పియు నాదుజీవితం
బెంచఁగవ్యర్థ మెవ్వనినొ యింపుగఁ బెండిలియాడినట్టి యా
చంచలనేత్రపై వలపునల్పుటయుంగడుఁ బాతకంబనూ
నంచుశరత్తువూరుఁడురయంబున మోమునొకింత యెత్తినన్.

గీ. తనను గోరిన పాద్రిశాంగన కడంకఁ
జందురుం గోరుటది మదియందెఱింగి
పశ్చిమాంభోధిలోఁబడి పాణమూడ్చు
వాఁడు వలెఁగానఁగాఁబడె వేఁడివేల్పు.

గీ. వెంటనే లేచి యతఁడు వెన్వెంటనున్న
దీర్ఘికానీర మందున దిగియు మెల్ల
వార్చి తొడి డిల్లవడిన హృత్పద్మ మందు
నెక్కొనిన చింతతోఁ గాంచె నొక్కమఱ్ఱి.

శా. చూడా పాశములూఁగులాడఁగఁ గడున్ క్షోభించు భూతంబనా
నూడల్ పెక్కు పృథక్ పృథక్ స్థితిని సంయుక్తస్థితిం గూడ వ్రే
లాడన్ నిచ్చలు బొల్చుచుండు నటనాన్యగ్రోధ వృక్షంబటన్
నీడన్ జేరె శరత్కుమారుఁడు వికుంఠభూత చేతస్కుఁడై.

గీ. "కాలమా! యెంత యడియాస కనఁబఱిచితి
మెడను విఱిచి యొనర్చు నీ బడుగు పెండ్లి
నొప్పి కొనకింత వట్టు నేనుంటి" నంచుఁ
బరిమిత స్వరముగ వినం బడఁదొడంగె.

ఆ. చెవుల మూసికొంచుఁ జింతించె నిట్టుల
నతఁడు "నేను జగతిఁ బ్రతికియున్న
గోలుపోవు ధృతియు నిలువు యోగ్యత
కాన బ్రతికియుంట కాదు నీతి."

మ. అని యూహించి శరత్కుమారుఁ డెలమిన్ న్యగ్రోధ దీవ్యచ్ఛిఫా
ప్రవివేష్టికృత కంఠనాళుఁడగుచుం బ్రాణంబులం బాసి యొ
య్యన నాకాశ మహాంతరాళమున వ్రేలాడెం ద్వరం బొందియు
వ్వనజాతాయతనేత్ర వచ్చియుపుడే వల్దించు వారింపఁబోన్.

# శుద్ధపత్రము.

| పుట. | పజ్త్కి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 2 | 6 | జెందంగదే | జెందంగఁ దే |
| ... | 8 | తక | తను |
| ... | 21 | కుమారు | కుమారుఁ |
| 4 | 3 | మహిళకల | మహిళలక |
| 5 | 16 | సుమకోమలికిన్ | సుమకోమలకున్ |
| 6 | 6 | దోసగుపోడిమి | దోసఁగుపోఁడిమి |
| 7 | 9 | గమించె | గమించెఁ |
| ... | 20 | బర్వగన్ | బర్వఁగన్ |
| ... | 22 | ఆగి | ఆఁగి |
| ... | 24 | ఒక్కడున్ | ఒక్కఁడున్ |
| 8 | 20 | సౌందర్యబు | సౌందర్యంబు |
| ... | ... | పాంటగన్ | పాటంగన్ |
| 9 | 4 | తీరుతోఁప | చెన్నుడంప |
| ... | 19 | పత్రాళిలబోల్చు | పత్రాళిలఁబోల్చు |
| 10 | 9 | మన్మథుడు | మన్మథుఁడు |
| | 11 | ధార్ష్యము | దార్ష్ట్యము |
| 11 | 11 | మునపార | మునుపార |

| | | | |
|---|---|---|---|
| 13 | 8 | పెఱిఁగి పెఱిఁగి | పెరిఁగి పెరిఁగి |
| | 14 | సంధానము | సంధానము |
| | 15 | విధానము | విధానము |
| 14 | 1 | నాబొంది | నింబొంది |
| | 3 | విధా | విధా |
| | 3 | జగజ్ఞాన | జగజ్జ్ఞాన |
| | 6 | పయిఁపై | పయిఁబై |
| | 9 | అనవుఁడుకు | అనవుఁడుఁగు |
| | 10 | చేష్టన్ | చేష్టల్ |
| 15 | 2 | నాఁడఁగ | నాడఁగ |
| | 18 | వ్యర్ధ | వ్యర్థ |
| 16 | 7 | నిచ్చలుబొల్చు | నిచ్చలుఁబొల్చు |
| | 17 | దీవ్యచ్ఛిపా | దీవ్యచ్ఛిఫా |

హితకారిణీ కార్యాలయము, ఏలూరు.

శ తా వ ధా ని

శివరామకవి ప్రణీతగ్రంథములు.

| | |
|---|---|
| (1) సోముఁడు లేక ఉత్తరహరివంశ విమర్శము రు | 1-0-0 |
| మేలుప్రతి. (కొలదిప్రతులే కలవు.) | 1-4-0 |
| (2) సోముని జీవితము. | 0-1-0 |
| (3) ముక్తాలత—చక్రవి ప్రబంధము. | 0-12-0 |
| (4) తాలుకుట్టనము. (విమర్శము.) | 0-4-0 |
| (5) కొవ్వూరు శతావధానము | 0-3-0 |
| (6) తెనాలి. ... ... | 0-2-0 |
| (7) బెజవాడ. ... ... | 0-2-0 |
| [అవధానములు, తాలుకుట్టనము నొకతూరికొను వారికి | 0-8-0] |
| (8) కృతకసూత్రము. [ఖండకావ్యము] | 0-4-0 |
| (9) లక్ష్మీశ్వరసాపుర శతావధానము. | 0-2-0 |

ముద్రణలో నున్నవి.

(1) మణిమేఖల. [గొప్ప కల్పితప్రబంధము]

(2) మాధవవర్మ. [ఆంధ్రరాజులఁగూర్చిన నాటకము.]

(రెండు నెలలలో సిద్ధమగును.)

విలాసము:—


**వేలూరి.**

చిరివాడ, తేలప్రోలుపోస్టు,

కృష్ణాజిల్లా.